# అశోకవనము



( ఖండకావ్యము )

శ్రీ కృష్ణదేవరాయుల ఆంధ్ర భాషా నిలయమునకు

గ్రంథకర్త

పంగనామముల రామచంద్రరావు

కవితా కుటీరము, తిలక్ పేట-గుంటూరు.



శ్రీ వేంకటేశ్వరముద్రాక్షరశాల, గుంటూరు.

1933

## కృతిసమర్పణము.

లవముష్పాంగని ముద్దరాలు సరదాలన్ మున్గి
తేలాడు భీ। రువు క్రొంబూవు మిటారపుంబడుచు
తీరుల్ గల్గు నాభార్య నా। కవితాసుందరి గోర
నిచ్చితి గృతిం గన్యాళలామం "బళో। కవనం"
బల్లుడ! యేలికొమ్ము శుభవీక్షన్ వేంకటేశప్రభూ!

గ్రంథకర్త.

---

నానాటం గవితావిలాసరచనా నవ్యత్వ మంచుం
గవుల్ । దీనంబై చవిలేని చచ్చుకయితం దిండిం
బ్రసాదింపగా । దీనం దీఱదు మాకు నాకలి; భవ
ద్దివ్యామృతాహార మో। శ్రీనాథా! మఱిలేద!
నోరుచవిచచ్చెన్ నీ గుమాయింపుకై॥

---

ఇల్లాలైన రసోల్లసత్కవితతో నేనందనోద్యానవీ। థు
ల్లక్షించుచు నుండెనో సురపతిస్తోత్రంబులో నుండె
నో । అల్లాడించుచు నుండెనో కవిని శుక్రాచార్యు
మాటల్లికన్ । దల్లీ! ఆంధ్రమ! పోయి తెమ్ము కళ
కూతం బీయు శ్రీనాథునిన్॥

(1) ప్రజాహృదయము దాకువాడు కవి. కదలించువాడు కవిరాజు. తినివేయువాడు కవిసార్వభౌముడు. ఎవరి పద్యముల చక్కదనమును మించి యితరు లెంతవారైనను దిరుగ వ్రాయలేరో వారు కవులు. ఎవరి కవిత వినుటకు నోట వల్లించుటకు భాషాభిజ్ఞులు సాధారణులు నిర్వురుగూడ కుతూహల పడుచుందురో వారు కవులు. (2) తొందరగా నర్థముగానివ్వని నేటి వ్రాతలలో నత్యధికమగు భావపుష్టి కనుబడుచున్న దనుట రసజ్ఞుల ప్రతిభను నిందించుటయే. (3) 'ఎంకిపాటలు' వంటి వ్రాత లాదరణీయములు. (4) గద్యమునకు లేని ప్రత్యేక వ్యక్తిత్వము పద్యమున కెందున్నదో తెలిసికొని వ్రాయుటయే కవిత. (5) ఈకావ్యము 1926 లో వ్రాసితిని. ఈ వ్రాత యిప్పుడు నాకే యంతగా నచ్చదు. అయినను వెలువరించితిని. విమర్శకులు కఠినముగా విమర్శించి సరియగు త్రోవ నాకు జూపవలెనని మనవి.

## నా విషయము.

గుంటూరుమండలములోని పొన్నూరు సమీపమున నుండు కట్టెంపూడి నా జన్మస్థానము. 1903 లో నా సోదరుడు వేంకటసుబ్బారావు నేను మా తలిదండ్రులు లక్ష్మమ్మ లక్ష్మీకాంతరావులతో ఈ తెల్లచదువుకొఱకు గుంటూరు వచ్చితిమి. 'బస్తీ' కాపురముతో నిల్లు గుల్లయినది. పేదకుటుంబము. బ్రాహ్మణులము. వైష్ణవములేని గోలకొండవ్యాపారులము. కాశ్యపసగోత్రము ఇప్పటికి 20 ఏండ్లనుండి గుంటూరు 'టౌను' హైస్కూలులో నుపాధ్యాయుడనుగా నున్నాను.

పం. రామచంద్రరావు.

రాసున్న యొక ఖండకావ్యములోని పద్యములు.

దేవతాగృహాపురంధ్రీపూజలందెల్పు పసుపువాటిన కాళ్లు
బారముడువ । మెగము కుంకుమబొట్టు పుణ్యాంగనలలోని
మాతృశ్రేయము బరామర్శసేయు । గంఠసీమంబును గౌగిలిం
చుచునుండ వేల్పుటేటిపసిండి విరులదండ । పట్టుపైన యొడలి
పై బ్రకాశించుచుండంగ బ్రస్ఫుటస్వచ్ఛలావణ్యదీప్తి । పచ్చ
పచ్చికపట్కల పల్లవములు । దంతముల మధ్యమందు నృత్య
మ్మొనేయు । నూరుచుండెను గల్పకకుజమునీడ । గామ
ధేనువు రాజమార్గంబునందు॥ (1)

లాంగూలాంతికమందునన్ నిలువ నుల్లాసంబుతో భర్త, సా
రంగాంకానన మొప్పచుండ నెదురై రాజ్ఞీలలామంబు తా
ముం గొమ్మోమ్మరగ నుండ—మధ్యమున జూపుం దేటలం గన్పడెన్
సింగారంబులవేల్పుగిడ్డియనుగుంజిన్నారి పొన్నారియై॥ (2)

మేలిమి వన్నెచక్కనిది మీనుసిడంబరదంబుపూవజీ । రాలము
లేక కైకొనిన యాఱవబాణము వేల్పుగన్నియల్ । వ్రాలెడి
యాటలందు దళవాయి మునీంద్రుల కంటిచూపు మొత్తాల
మిరాశి బాల్య మెలదాటుచునుండె భవాని వ్రేల్మిడిన్॥ (3)

తమ శృంగారరసార్ద్రగీతికలచేతం గాముకుల్ గిన్నరప్రమదా
రత్నము లందు మన్మథవికారం బింతపుట్టించి సన్నమఱుంగుం
జలతారుటంచు మొలచీనాపట్టుమేల్పావడన్ । సమయస్ఫూర్తిగ
బైకినెత్తెదరు లజ్జాదృశ్య మీక్షింపగన్॥ (4)

పశుపతి నిషణ్ణుడయ్యె దపస్సుకొఱకు । సౌరభమ్ముల చలి
గొండచఱియయందు । గంగపయిప్రాలు సరళవృక్షములనీడ ।
బులికళాసంబు జఘనమండలము నలమ॥ (5)

# అశోకవనము

## అధ్యాయము ౧.

### అశోకవనములో హనుమంతుడు ప్రవేశించుట సీతను జూచుట.

అంభోధిప్లవనావతీర్ణుడయి దైత్యప్రాజ్యలంకాపురీ।
శుంభద్గోపురలంకిణిం బెనగి రజ్జుల్ మాపి యన్వేష
ణా।రంభుండై సురబంధనాలయములుం బ్రాసాదముల్
సూచుచుఁ। సంభూతక్లముడై కపిప్రవరుడాశా
బంధముఁ ద్రెంపుచుఁ

చూచితి లంకలో గగనచుంబిమహాజ్వల తుంగ
సౌధనై।శాచర కేళిధామముల జారుసుమోపవనంబు
లందు గ్రీ।డాచలశృంగకుట్టిమచయంబుల బుప్పొద
రిండ్లయందు దీ।ర్ఘాచతురత్వరీతి బొడగట్టదు జానకి
యేమిహేతువో

రావణానీతయువతీకారాగృహముల।శౌనసపుటిండ్ల
మచ్చుల బయళులందు। సందుగొందుల గంటి మా
జనని గొఱకు। నిష్ఫలారంభ వేదనాన్వితుడనైతి

కపిసంఘంబులతో బడాయి పలుకుం గచ్చెల్
మహేంద్రాచలం। బుపయిం జేసితి ,, రామచంద్రుని
సతిఁ భూదేవిగారావు గా। నువు నాతావణువేరి
బెబ్బులి కడఁ దుఃఖించు గోమాత లో। కపవిత్రం
గనివత్తు" నంచు నకటా! కాన్పింప దెప్పట్టునఁ

పఙ్క్తి కంధరపట్టణాభ్యంతరమున। నరసితి విదేహరాజ
వంశాభిజాత। బొడమె కన్పట్ట దింక బైపాలముజూతు।
రాజబాహ్యోపవనవృక్షరాజినడుమ

* వ॥ అని కొన్నివట్ల గోచరంబును గొన్నింట
నగోచరంబును నగుచు మార్జాలసదృశస్వల్పరూపం
బున దిరుగుచు సీతాన్వేషణనిష్ఫలప్రయత్నంబుల
విసివి, వేసారి, దీర్ఘనిశ్వాసంబులం బుచ్చుచు కి త్త
మనసునం బోయిన శ్రీరాఘవేశ్వరుం డేమిగా
దలంచునో యను పరితాపంబున భావోపభావంబు
లల్లడతల్లడం బెట్ట నాత్మాధిగతపూర్వధైర్యంబు
కుంటువడి తదవస్థాదోషంబు గమనమాంద్యంబున
నావిష్కరింపజేయుచు స్వామికార్యనిర్వహణదీక్షా
భరితహృదయుం డయిన రామదూత యగు
హనుమంతుండు పోయి పోయి,

మొగలిపూరేకుపుప్పొడిదుమారము గ్రమ్మి పసిడి
కంచెలు చుట్టు బరిఢవిల్ల । శుద్ధచంద్రోపలసోపాన
సుందరక్రీడాసరస్సుల క్రేవలొప్ప । జలజబాంధవ
పాదసంచారముల కింత శ్రమము జేకూర్చెడి శాఖ
లెలయు। సహకార వకుళ వృక్షభుజంగులను గూడు
సుకుమారలతికల చొక్కు లోలుక । బనసపాటల
నీపాదిపాదపముల । లెక్క మిగులు నశోకముల్
చిక్కవెట్ట । నొప్పు పుష్పవవనసీమ మొందు
చూచి । తిరుగజొచ్చెను హనుమ వైదేహికొఱకు

దానవేంద్రుని కేళికోద్యానమందు । వేల్లితలతా
కుడుంగముల్ వృక్షకములు। పిల్లకాలువలుం దాటి
పెరిగియున్న।సమధికాశోకతరుల జొంపములలోన

కుటిలాత్మల్ కపిసూకరద్విపముఖుల్ కూర్మాసబాధా
సము । త్కటతాభావలు మందుకోదరలు మాద్య
న్నీలమేఘప్రభా । పటలాంగుల్ వికటాట్టహాసలు
క్షుధాభావానుసారస్ఫుర। న్నిటల భ్రూకుటులంబుద
స్తనితవాణీధోరణీభీకరల్

సెలవులందున శాతదంష్ట్రికలవారు। ఘుర్ఘురన్నాసికా
పుటగుహల వారు । చికిలి వెట్టిన పాఱనాలుకల
వారు । రాక్షసస్త్రీలు పూవుటేరముల దరుల

పదిపదునైదుమంది దృఢబాహాలు గల్గిన యాఁడు
మూఁక ష| ట్పదమధుపానఝుంకరణపేశలతంబుల
తోఁడ నీడసం| పద లిడు నయ్యశోకములపట్ల
బొడంగని తా నదేమొ చూ|చెదనని వానరేంద్రు
డవశిష్టసముత్కలికావినమ్రుడై

పూబోదల జేబులందు రాముని గుణాఢ్య| దిరిసె
నపుబుష్పవంటి మాతృస్వరూప| నలయు గాలింతు
మందభాగ్యులకు నెపుడు| శుద్ధకార్యఫలావాప్తి
చుక్కయెదురు

అని తలపూని సంశయమహాంస్మృతిగోల్పగ మోడు
వెట్టు నె| మ్మనము చిగిర్చుచుండ హనుమంతుడు
వారి సమీపభూమికిం| జని సడిలేక నిశ్వసన
సాంద్రిత గొంత సడల్చి యోలమున్| గొన
నవమల్లికాసురభికోమలకుంజగుహాంతరంబునన్

అమితోగ్రత్వముగల్గు సింగములచాయన్ లేడి
మాడ్కిం బ్రపం| చమనోమోహన భోగబోధక
కళా చంచత్పిశాచీ కదం| బములో వైదికవాణి
వోసె భయకంపంబెత్తి యల్లాడుచుం| డె మహా
సాధ్వీ కఠోరరాక్షసవధూటీమండలాసీనయై

దానవీపరుషవాగ్దండహన్యమానయై శ్రీరామఘన
కృపాసార • మెంచు । నసురాంగనాపరిహాస
చంద్రిక గొప్ప • రఘువరపార్థివుడ భ్రముదలంచు!
రావణాసురకథల్ రాక్షసస్త్రీలెంచ శ్రవణపుటంబు
హాస్తమునమూయు! భర్తృప్రతాపదుర్వర్ణనంబులు
విననోడుచు మనసులో నుదిలకొనును సాంద్ర
విషయార్తిలోన నిశ్చలితయైన । ధ్యానయోగిని
మాడ్కి సీతాశుభాంగి । రామ — శ్రీరామ
రఘురామ — రామ యనుచు । రామజప
మెంచుచుండె ధైర్యంబు విడక॥

అకలంకంబు కదుంబవిత్రము విచింత్యం బాత్మ
తత్త్వప్రబో । ధకమార్గోగ్రతమః ప్రయాణమున
కుద్యత్ప్రాణిదీపంబు లో । కకుజంబందున శాంతి
నీడమున మోక్షస్వైరగానోల్లస । త్పికరాజంబగు
రామనామము వినెఁ బ్రీతిం గపిశ్రేష్ఠుఁడుఁ॥

మంటిలోనుండి వెలువడు మణులరీతి। ముదుగు
మబ్బుల మెఱపుతుంపురుల పోల్కి। భీకరాసుర
కాంతల మూకనుండి। రామతారకనామస్మరణము
వెడలె.

పాపనివారకం బయిన పాపనిశాటసతీప్రలాపవాక్। క్షేపకమంద్రకంఠపరిఖేలదచంచలరామనామముల్। దేవకు దేవకుల్ వినుచు దేలికవక్షమనస్సు వేడ్కతో। రూపడుచుండగా గపివరుండు దరస్ఫుట నిశ్చయాత్ముడై.

చెలగి శోకధ్వనిల్ రాక్షసీజనంబు। పదువులో నుండి 'రామ' శబ్దంబుపలుకు। మృదుమధురవాణి యెవరో చూచెద నటంచు। నంజనాపుత్రకుడు శింశుపాగ్ర మెక్కె.

సహజవిపులాంగకములు పెల్చిన గరంబు। చిఱుత వఱచుచు నొక కొమ్మ చిగురునందు। గుబురు టాకుల చీకటి గూడులోన। మర్కటవతంసు డుండె సంభ్రమముదోలక

ముడిచినమూతితో గవులు పోయెడు ముద్దు పసందు గూనుతో। విడిచెడు కొంకుతో నడచి పెట్టిన గొప్పదనంబుతోడ న। ప్పుడుచు గడిందిజోదు నిరపాయముగా నుపవిష్టుడై ముదం। పడి నునుగ్రొత్త కెంజిగురు మవ్వపుటాకుల సందుల్లోవలన్॥

భువి సంసారకఠోరబంధవిషయంబుల్ పట్టిపాలార్చు
చు। న్న వివేకంబున నుండు జ్ఞానివలె నిండా
భాషణాలోలదా। నవకాంతా జనమధ్యమందున
దృఢానందంబునన్ రామనా। మవిలాసంబున
నుండు సీతను జగన్మాతం గనన్ దూతతాన్॥

మాసినప్రాతచీర రుచిమత్త్వము పోయి వనీరజశ్ఛటా
ధూసరమైన దేహము విధుంతుదపీడితపర్వచంద్రబిం
బాసహజాననంబు మొగమందున జిడ్డులు వోయి
ధూళిచే। వాసనగొట్టగల్గు పయి వ్రాలుగురుల్
గపిగాంచె జింతతోన్॥

చెమటలోడ్చెడు చిన్న చిరుగువాటిన పైట బిగు
వొత్తుకొల్ల యోపికలు దనర। బసిమి వాడిన
ముఖపర్యంతమందెల్ల డెలికంటి నీటిముత్తెములు
గాఱ। నలకలాటలలోన నలగి కుంకుమబొట్టు
కెందూళితుంపురుల్ గెలన జింద। నపపోషణాంబైన
యుడపచింపిరి జుట్టు బిల్లగాలులు గజిబిజి యొనర్ప।
బహుళదీర్ఘోష్ణ నిశ్శ్వాసపల్లవముల। దఱచు వేయగ
నాసాలతామతల్లి। జాలిపుట్టించె రాణివాసంపు
టబల। భరతమాతకు బుట్టిన పసిడిసీత॥

* వ॥ వెండియు నాంజనేయునికి

ఒడ లుప్పొంగగ గుండె నీరవడె ధైర్యోపార్జ
నానంద చం । ద్రిక కాంతిం బ్రసరింప
మంచు మునురుల్ దోడ్తోడ వర్షించె నా । బిడ
కన్పట్టిన సంతసంబు మదిలో బింబించినం దల్లడం।
పడె గీశుండు విదేహరాజతనయాప్రాప్తోరు
కష్టంబులన్॥

కనులన్ నీరు స్రవించినం బయిపయిం గాంతా
ముఖోద్దీర్ణ మో । హనరామామృతవృష్టిచే దడిసి
ముద్దయ్యెం గడున్ లోన భ । క్తుని కన్యంబు
స్ఫురించునే భగవదాందోళామృతాపూర మ।జ్జనమే
కాని నిసర్గదృష్టులుగదా సద్భక్తులున్ సత్కవుల్॥

* వ॥ ఇట్లు గొంతసేపయిన వెనుక

రామనామామృత భక్తి సంభ్రమభరంబు । రామ
కార్యంబు భగవదారాధనమున। గలవిశేషంబులుగ
దోచి కన్నువిప్పి । రాముదేవేరి గనజొచ్చె
రామదూత॥

ప్రభుతలందు పశోకుని ప్రభుతవోలె। శబ్దములనెల్ల
నోంకార శబ్దముగతి। నాగరకతలలోన హైంద
వునిదివలె। నాడుగుంపున వరలె శుభాంగి సీత. .

రాముని విశ్వమోహనవిరాజదమూల్యగుణాభి
రామునిఁ। నేమముతో దలంచుచు వినిర్మల
నామము బల్కుచున్న నా। కామిను లెల్లరుం
దమ వికారపు జేష్టలె కాని రామనా। మామృత
మిచ్ఛగింపరు గదా గతజన్మవికర్మవాసనఁ.

అంగనాజనప్రసంగాస్వాదనుస్థిరబుద్ధి యెవ్వారికి
బ్రొద్దుపోక। యెవ్వారి కక్రాంత మాప్నితాంత్యా
వధి సంసారవహన దీక్షాప్రసక్తి। అతిమాత్ర ధన
సంచయాభోగ గరళైక కేళికెవ్వారలు క్రిమి
కులంబు। దేహపోషణ మితి దెలిసి యుల్లంఘించి
యెవ్వారు పెనుదిండి నిచ్ఛగింతు। రైహికామోద
సంధాన మనెడి బురద। ముచ్చటం గొను క్రోడ
సమూహ మెవరు। అట్టి నిర్భాగ్యనరులకు బట్టు
వడునె। 'రామ' బీజాంకురానంద రాజ్యఫలము.

సర్వ సర్వంసహా చక్రవర్తిపదంబు వెగటుజూపుల
జూచు వెట్రివాంద్రు। భరతమాతకుగల్గు ప్రవిమల
వ్యక్తిత్వ మూటాఅనీయని మోటుజనము। గొడ్డు
టంబలిలోన గూఢపాయసభక్ష్యసరసాన్న రుచు
లెంచుసన్నకారు। పూబోడివలపుజూపుమిటారముల
లోన బిడ్డలేజూపుల బెనచుబడుగు। లలనిరా
డంబరులు దరిద్రానుభవులు। మానరహితులు
మితభాషులైనవారు। రామనామ బీజాక్షర కామ
ధేను దుగ్ధముల కానపడు ప్రబుద్ధులు ధరిత్రి।

* వ॥ భగవద్భక్తిమంతుండగు హనుమంతుండు
సీతావస్థం దిలకించుచు. గరుణాతరంగితహృదయం
బున బరివేదనంబు నొందుచుండె నంత

ఉదయపర్వతశిఖరోపవిష్టుండయి యసురపై గోపిధ
రక్తాక్షుడయ్యె। గ్రమముగా నెగసి వృక్షస్థలంకా
పురిదాటె దెల్వగను సాధ్వసముచేత। జానకీవనముపై
జనుచు నారటపడి వారివాహమున గన్నీరుగార్చె।
గగనంపుగొన జేరి కడకు శాంతామర్షదీప్తిమంతు
డయి సాత్వికభయంబు। గొల్పు బోధనవిజ్ఞాన
గురువుపోల్కి। దైత్యుచేపడి కలగు సీతను గుఱించి।

పతికి దెల్పఁబోయెననఁగ బశ్చిమాబ్ధి। అంశుమంతుడు
సేరె బ్రయాణదీక్ష॥

లలితానందకరప్రపంచమను లీలలోఁ వుపెండ్లింటిలో
విలసన్నాస్తికభావనావిషయతృప్తిప్రాప్త మృష్టాన్న
మగ్గలమెక్కించిన కాలపూరుషుడు మైకంబేర్పడఁగ
దూగి నిద్రితెనా జీకటితారుక్రొంబురద చిందఁగ
లోకమందంతటఁ॥





అధ్యాయము ౨.

సీతా రావణ సంభాషణము.

* వ॥ ఇట్లు పర్విన తమఃపుంజంబు లోకంబు నంధీ
భూతం బొనర్చియుండ నంతలో శీతమయూఖోద
యం బయ్యె

  

లోకమందంతటను సమాలోక్యమయిన। పండు
వెన్నెల దోచె నా పాపమేమొ। రాక్షసేశ్వరహృదయ
నిర్భరపరాంగ। నావగత మోహతిమిరంబు లడగ
కుండె॥

అరయ బైపెచ్చు ప్రబలత్వ మందుచుండె। నీటి
చినుకుల గ్రాగు నూనియవితాన। యామినిభోజన
క్రియానంతరమున। సురభితాంబూలచర్వణ శోభి
యగుట॥

* వ॥ ప్రథమంబున లంకాపట్టణాభ్యంతరమున
దననిడు వాలుజూపులం బ్రసరించునపుడు శ్రీరామ
సతీవేదనాదూయమానుండై కోపంపు మొగంబు
వెలింబఱచె నను విచికిత్స నుత్పాదించుచు దేజో
మయుండైన చందురుండు కొన్ని నిమేషంబులలో
నాత్మశరీరహేమఘటంబునుండి వెడలు వినిర్మల
సుధాధారాపూరంబుచే గువలయ కశ్మలత్వం
బంతయు బరిక్షాళితంబొనర్చె. బ్రహ్మాండం
బను నీడంబునందుండు ప్రాణిచకోరంబులకు హాయి
కూడు వెట్టుచు నేతన్మాత్రానందానుభవము బట్టి జగ
ద్వ్యాపకపరబ్రహ్మస్వయంప్రకాశ తేజఃపుంజంబుల
నిస్సమానతగూర్చి జ్ఞానధనార్జనపరులగు ముముక్షు
వుల భావబంధంబుల జిక్కించుచు బ్రతిభామధురం
బయిన కవితారచనావిచారంబున సత్కవీశ్వరుల
నిర్మగ్నులం జేయుచు నీతిగంధానుబంధం బెఱుక
లేని యనాత్మవిద్యార్థులై దేహభోగలాలసులగు
దుండగీండ్ర కుద్రేకంబు సేకూర్చుచు దిగ్భిత్తికల
నొత్తుగ బాలవెల్ల బూతబూయుచు బండువెన్నెల
యెల్లెడ నిండుకొనియుండునపుడు॥

కౌముదీ నిర్మల కమనీయ కార్పాసకూర్పాసమును
మేనగూర్చి తొడిగి। తెలుపు వెన్నెల తేట జిలుకు

చుండు జిలుఁగు జలతారువలిపంబు సవదరించి।
సహజకోపాంశుభాస్వరమైన ముఖసీమ గలయ
విభూతిరేఖల నమర్చి। శంభుపూజావిధాచతుర
హస్తంబున ఘటియించుచు విలాసగమనయష్టి।
వేల్పుమగనాలి జిటికెనవ్రేలబట్టి। నర్మభాషలతోడ
జిర్నగవుతోడ। మన్మధపిశాచనిష్పీడ్యమానుడరిగె।
రావణుడు జానకీపతివ్రతను జూడ॥

వాసనల జల్లు శీతలవాయు వోలయు। రావణేశ్వరు
డంచు ,పారా' నెలంత। లోడఁబు సవరించుకొనుచు
ప్రత్యుద్గమనము। నేసి తెచ్చిరి దైత్యుని సీతకడకు

రక్షోనాథు డుదగ్రకాముకవికారంబొప్ప భ్రూవల్లరీ।
విక్షేపంబు ముసుంగువవ్వాల పసల్ వీక్షావిలాసం
బులుఁ। దక్షత్వంబున జూపుచుఁ దరుణితో
దారాడుచుఁ రాగ బ్ర। త్యక్షంబయ్యె దమో
వికారు డని సీతాదేవి యెగ్గించుచుఁ॥

మాపుంజీరచెఱంగుపై ముసుగుతో మార్గోమముతో
గెంపువా। ల్జాపుల్ వేసిన నీలికన్బొమలతో లా

లోపలన్ జీవితా। శాపాశ్రోచ్ఛ్వసనంబుతో రఘు
కులస్వామిన్ స్మరింపించు దీ। క్షాపూర్ణత్వముతో
కృశాంగి దురవస్థాదుఃఖ వర్తిల్లగన్।

కనుగెలంకుల నగవుమొల్కలు దలిర్ప। మిడిసిపడు
చున్న రాచడాంబికములోన। బెగడు బేలతనంబు
ముప్పిరిగొనంగ। నమ్మహాసాధ్విగనె రావణాసురుండు

మానుగ బయ్యెద దొలపమార్గ్రముదిప్ప। నలతి
రక్కసు డేమిసేయంగలేమి దూరమున మల్లెతీవ
చందువున నిలిచె। నగ్ని నేభంగి జెదవురు వంట
నోపు॥

అహాఽహా ముందు రామచరణాంబుజసంస్మరణావధా
నధూ। ర్వహాత యొకింత సన్నగిలె రక్కసి రాక
దటీయు భావణ।గ్రిహాణపు బోక సీతను___ బరాకు
వడెన్___మనసెంత మోసగా। డహాహా! దురూహ్య
డా మునులకైనను జిక్కడు లొంగదీయగన్॥

అసమర్థత్వపురీవి కొంకు సరసవ్యాహారభంగీకళా।
భ్యసనంపుంబయిపూత నవ్వ నటనల్ పంచాస్త్రు
డెక్కించు వె। త్రి సమానంబుగ నేకమై దనుజునిం
బ్రేరేపి రప్పించె నో। యీ సురాపానపు గంపు
నోటను నసభ్యంబైన వాగ్ధోరణిన్॥ 50

— రావణుడు సీతతో సంభాషించుట —

తరుణీ! రాచరికంపుదొందరలచేతన్ మాటికి న్మా
టికిన్। సరసోద్యానవనంబులోని నిను గాంచన్
వచ్చిపోనైతి ని। ద్ధర సంసారము రాజ్యపాలనము
నీదన్ రాని బంధంబు లీ। చెలియే సౌఖ్యములొద్దు
చుండును గదా చిత్తస్థితుల్ మాటిన్॥

తనువను కొల్వులోపల సతంబు శ్రమంబున నంటి
యుండు నీ। మనసను లంచగొండి నెటో మన్నన
జేసి వశీకరించినం। గనుపడు నీప్రదేశమె వికస్వర
కేళివనంబుగాగ నీ। వనితలె చెల్మికత్తెలుగ బాడు
మనస్సె యుజయ్యా మేరికిన్।

* వ॥ ఆ మహాపతివ్రత యా దుర్మార్గుని మొగంబు
సూపోపక తృణలేశం బొందు గ్రహించి వాని
నుద్దేశించి పలికె

సీత:—

లంచగొండితనంబు దుర్వంచనంబు । నమరికె
నెఱుంగువారు లంకాధిపతులు। వారికి మనస్థిరత్వ
మేవంక గలదు । అరసి చూడంగ శూర్పణఖాగ్ర
జులకు॥

రావణుడు:—

సాభిప్రాయముగాగ శూర్పణఖతో సౌదర్య మెగ్గిం
తువా । హా! భీరుత్వము గూడ దెవ్వరికి మో
హంబున్న జేపట్టరా । దో భామామణి యేరి
నైన నయినన్ దోసంబు మావంక నే । నా
భావించుట — చంద్రికా సుభగచంచద్గాత్రి !
నీలాలకా॥

సీత:—

ఛీ! మృషాలాపమగు నాల్క చీలునేమొ । త్రిభు
వనాకర్షకరమహోత్కృష్టసుగుణ । పూతచరితుండు
యువతుల ముద్దుబిడ్డ । అగ్నిపరిశుద్ధ రాము
దూఱాడ నగునె॥

రావణుడు:—

అలకపల్కుల గలికిముల్కులను గొనిన । సరస
భాషామృతకణంబు జల్లుచున్న హృదయపుష్పంబు
వెదజల్లు ప్రేమ గంధ । మంగనాజాతి సృష్టి
యత్యద్భుతంబు॥

సీత.—

మొగమున బేడనీళ్ళు పడమోదిన నిర్మలవాసనా
మిళ । మృగమదచందనద్రవమురీతి దలంపగజేయు
మోహపుం । దెగులున బెద్ద చిన్న గణుతింపగ
జాలని పూరుషాధముం । దగ సృజియించి బ్రహ్మ
పురనాయకు జేసె నదెంత చిత్రమో !

* వ॥ అని యిట్లు కొంతవడి నివురుగప్పిన నిప్పును
సమిత్ప్రవృద్ధం బొనర్చి శిఖాత్యుష్ణంబున నోర్వ

లేకుండు జడుని తెఱంగున రావణుండు మోహా
పిశున దుర్భాషణంబు లాడి యార్యావర్తధర్మం
బగు పాతివ్రత్యంబే సాకారంబై యెదుట నధి
వసించియున్న వైదేహిచే గఠినవాక్ప్రహారంబులం
బడి తుట్టతుదకు

రావణుడు:—

ఆర్యావర్తము బాసి వచ్చితిరి రాజ్యభ్రష్టులై
స్త్రీలచే। భార్యాభర్తలు మీర లందు మృగ
రూపం బొందు మారీచుచే। వీర్యక్షీణత బోయి
యుండు బతి నీ విశ్వాసముఁ మానుచుఁ।
ధైర్యంబుం గొని యుండు నీ కిట గొఱంతల్ లేవు
చంద్రాననా !

పోయిన వాడు పోయె నిక ముందయినఁ బ్రతు
కంతకాలముఁ। హాయి సుఖింప జూచికొను
మబ్జముఖీ! వనితానురాగసం। ధాయక సౌఖు
మార్యము మనఃప్రభవాగమహేతువైన యీ।
ప్రియము దివ్యరాజ్యమును బట్టము గట్టుము
రాజభోగికిఁ।

మగడు సజీవుడైనను సముంచితరాజ్యసుఖానుభోగ
ముల్ । దిగవిడి వచ్చువాని సుదతీమణి! యేగతి
నేలికొందు వి।మ్మగు బిగువెత్తుజవ్వనము నాజ్యము
• బేదతనంపుబూడిదం । దగిలి వెలార్తువే ప్రభు
హుతాశన తృప్తికిగాక కామినీ!

* వ॥ అని యిట్లు పలికిన యనంతరంబున

సీత:—

అఖిల రాజ్యజనాళి యనుభవంబుల గొను మిత
సౌఖ్యభోగసంయుతులు వారు । రాజ్యభోగాళి
దుర్మదులైన సోదర భూపాలురను జూచి పొగులు
వారు ॥ భగవత్ప్రసాదిత పరిపాలనబుణంబు మత
నీతి దీర్పంగ మనెడివారు । బ్రిహ్మార్పణం బంచు
రాష్ట్రప్రజార్థంబు ప్రాణంబు లిడు మహాప్రభులు
వారు।భార్యగా గైకొనక మాతృభక్తితోడ। రాజ్య
లక్ష్మి భజింతురి మారాచవారు । అట్టివారికి
రాజ్యంబు మట్టుపడిన । ననుకొన రొకింత —
హైన సౌఖ్యావహంబు॥

హారిణరూపంబుగొను రాక్షసాధముండు ! ఆర్య
సుక్షత్రియుం జంప నలవి యగునె?। ఏకపత్నీవ్రత
త్వాద్యనేకసుగుణ । సప్తజిహ్వాలమాడి మసాన
మగును।

ఆఋషిప్రోక్తధర్మానుశాసన మను చిత్రంబునకు
నెల్ల జీవపుష్టి । మానవతీ జీవితానంద లతికను
బరువు లెత్తించెడి ప్రాకుగొయ్య । ప్రాణనాథ
నికృష్టపరుషచేతశ్శిలా మహిమంబు కరగించు
మంత్రయష్టి । భవబంధవిచ్ఛేదపరమాత్మ తా
దాత్మ్య పటుసౌధమునకు సోపానపఙ్క్తి । భర్తృ
సంసారమనియెడి వంటచేని । కులుకు బ్రాయంపు
బడుచు బిట్టలను దఱుమ। గాపు పెట్టిన యొడిసాల
గడ్డయనగ । నగ్నితుల్యపాతివ్రత్య మలరు మాకు॥

జడుడైనన్, రసవద్విలాస సముదంచద్భార్య జేపట్టి
యున్ । విడియాకుల్ గ్రహియించి దుశ్చరితు
డై వేశ్యాప్రియుం బొందినన్ । బడుగుం బేదతనం
బులో నలిగినన్, భర్తన్ విడం బోవ రె । న్నాడు
మా యార్యసతీమతల్లుల కలఙ్కారంబిదే యుద్ధరన్-

జ్ఞానిమొగమున బ్రహ్మతేజంబుకరణి । తులసిలో వైద్యుతాకర్ష విలసన మటు । ప్రథిత గంగాధునీ పవిత్రత్వమువలె । సాధ్వియం దగ్నిశక్తి ప్రచ్ఛన్న వృత్తి॥

నిగుడుగప్పిన నిప్పంటదగ దొరులకు । నాడుదైనను సింహంబు హత్య కసదె । తపసికిని బతివ్రతకు భేదంబు లేదు । అంగబల పరిచ్ఛేదకం బాత్మ బలము॥

లంకారాజ్యవసన్నిశాచరుల వాల్లభ్యంబు నీ మోమునన్ । సంకేతించు పితామహార్హ గుఱిచి విస్తారంబనన్ రాదు మీ । నాంకావిష్టుడె యైనచో ప్రభువు ప్రాయంపుం జెలుల్ వీధి నిశ్శంకం బోదురె దివ్యమార్గచరదీప్తావర్తి రాజేకదా !

విపుల సమస్తరాజ్యపృథివీ మహితాయత సౌధమందు దీ । పపుగొడి పాలకుండు; తన పాలిటి పోకయె గాజు కుప్పె యే । రుపడును వాని తెల్పువలె నిరోధము లేక బహిర్గతంబులై । నృపచరితాంబుధిం బ్రజ గ్రహించుగదా సుగుణోపలంబులన్॥

కనుపడదు గాని కాముండు మనకు రాజ। కీర్తి కాంతను హరియించు ధూర్తు డతడు। ఇల మహా మహులతని జయింపగలరు। ఆత్మనిశ్రేయసమె. పురుషార్థదృష్టి॥

చతురుదధిమధ్య లంకాప్రశస్తభూమి। ధర్మదేవత నాల్గుపాదముల నడపు। పరసతీమోహరోగావసరము నందు। నంటి సేవింపు రామమంత్రౌషధంబు॥

దశరథరాజేంద్రు ధర్మవర్తనుమించి యెంచి యొక్క తెకై మైపంచి యిచ్చె। విశ్వవిశ్వంభరావిమలసంఘ నిబంధనారామమున నెత్తె నమృతసరసి। శూర్ప ణఖ మిటారిచూపుల దపియించి నిందించుకొనియె జక్కందనంబు। ప్రకటశృంగారసామ్రాజ్యపీఠస్థుని బంచాస్త్రి గుప్పిట నుంచుకొనియె। నఖిల సద్గుణ మణివికాసాంచితుండు। ఆదిగర్భేశ్వరికి ముద్దుటల్లు డయిన। యేకపత్నీవ్రతుండు నాహృదయవిభుడు। రామచంద్రుడు మార్గదర్శకుడు నీకు॥

మన్నన్ మిన్నను గానకుండ జరియింపంగూడ దే మాత్రమే । నున్నన్ రాజ్యము; రాజ్యపాలన విధానోత్కృష్టమాద్యన్మణిన్ । వన్నెల్వెట్టుము సత్పవిత్రతపు సానన్ — నీవయిం జాలి నా। కన్నయ్యా ! వద పోద మాప్రభుని పాదాబ్జంబులన్ వ్రాలగన్- 75

రసము మాఱంగ నూతసరసజవప్రసారమున శ్రోతృ హృదయంబు జలదరించు । నట్లు నిట్టనిలువున నీరయ్యె నతడు।విశ్వసౌభ్రాత్రవాక్కళావిలసనమున॥

హృదయపాత్రంబులోని దుర్వికృతి యనెడి। కసటు నీటను బడుచుండ గతకమంత । గనుపడగ జొచ్చె నుత్తరక్షణమునందు । మానసవికారపరిణామమల విశుద్ధి॥

మతధర్మప్రథితప్రబోధమను భీమప్రజ్వలద్బాణము। ద్ధతి నేతెంచగ గాండిశీకుడగు కందర్పున్ విలోకించి యం । చిత సంబంధుడు క్రోధసేవకుడు కించిచ్ఛౌర్యముం జూపి త । ద్గతి బోయెం — బ్రిభుభక్తి యిట్టిదియె కాదా సేవకశ్రేణికిన్॥

చిత్తము గాడిపాఱగ గృశించిన దృష్టులనోడ్చు మోహమునఁ। నెత్తురుచుక్కలేక రజనీచరుడేమొ గొణుంగుచున్ శిరం। బెత్తక కన్నొబమల్ ముడిచి యేగుచు బల్కెనుగాపుగత్తెలో । "నొత్తిడివెట్టు" మంచు "జలమెప్ప నయోన భయోన జానకిఁ"॥

* వ॥ వెండియు నాసన్న నిర్వాణంబగు దీపం బొక్క పరివృద్ధియగు విధంబున సీతాదేవితో నతశిరస్కుండై 'రెండుమాసంబు లవధి నొసంగితి. ఈమనఃకాఠిన్యంబే నీ జీవితాభీష్టఫలవృంతంబు పరిత్రుటితంబొనర్చుం గాక' యని బెదరించి నిజగృహాభిముఖుండై సనియె. అనంతరంబున రాజాజ్ఞాబద్ధలైన రాక్షసాంగనలు ద్విగుణీకృతపారుష్యంబున నా లోకమాతను వివిధోపాయరచనావైశద్యంబున నష్టాకుల పెట్టుచుండిరి. హిరణ్యకశిపునిచే వంతలంబడు ప్రహ్లాదుని తెఱంగున నా సాధ్వీమణియు వారిదుర్వాక్యబాణంబులలో నలుగుచుండినను శ్రీరామనామధ్యానంబు వీసరవోనీక సేయుచు ననుక్షణంబు దత్క్షేమం బెట్లు విందునా యని యను కొనుచు బలవించుచుండ గొంతసేపటికి నారక్కసి మూకలు నిద్రాపారవశ్యంబునం బడియుండు నవసరంబున.

అధ్యాయము 3.

హనుమంతు డంగర మిచ్చుట

ఆతని రామభక్తి — పద్యాలు

అమ్మకు మ్రొక్కి లోన దనుజాధిముఖప్రదరాయ
మానవా! క్యమ్ముల ధీరతం బ్రకృతియంతయు
నిద్దురవోవుచుండ గా! నమ్మొనరింపసాగె కపి
నాథుడు రాముని సత్కథావిధా! నమ్మును గీచు
కారరణనస్ఫుటకాకలికాభరమ్మునన్॥

— ♦ హనుమంతుడు రామకథను గానముసేయుట ♦ —

కలడుల్లోకయశోవిరాజితుడు లోకక్షేమకృత్కార్య
ని! శ్చలు డాదిత్యసమానవిక్రముడు చంచత్ఖడ్గధారా
విని! ర్గళదాభీలవిరోధికంఠగతరక్తస్రావసంక్షాళితో!
జ్జ్వలసంగ్రామధరిత్రియా దశరథక్ష్మానేత భూ
మండలిన్॥

ఆతనిపుత్రకుండువినయావతు డున్న నరేంద్రకోటిలో
నీతికి ధర్మవర్తనమనీషకు బెట్టినపేరు సుందరీ । జాతి
కనుంగుసోదరుడు చల్లనిచూపుల యందగాడు వి ।
ఖ్యాతుడు రామభద్రుడు వికస్వరబాహుపరాక్రముం
డిలన్ ॥

కల రతనికిసోదరులు లక్ష్మణుడనంగ। భరతశత్రుఘ్ను
లనగ దోర్బలసమగ్రు । లన్నగారికి 'దాసోహ'
మను వినీతి । బీజమును బృథ్వి నాటిన వీరవరులు॥

విశ్వామిత్రమహామునీంద్రుడు క్రతుస్వేచ్ఛావినోద
క్రియా । విశ్వాసంబడగించు దుష్టుల వనిన్ వేటాడ
శ్రీరాముస। స్త్రాశ్వోచ్చంబుని దెచ్చి యజ్ఞము గొనం
బట్టించి నానావిధా। స్త్రైశ్వర్యంబు నొసంగుచున్
జనకరాజాస్థానముంజేర్చినన్ ।

పంటలేజవరాలి సంబరపుబిడ్డ । కమల మఱురూపు
సీత బంగారుతల్లి । దాపుడు ధనంబు వరులహ స్త
మునబెట్ట । జనకు డూరూర దెలిపె నుత్సవదినంబు

గృహామునందున్న చంద్రకిరీటు విల్లు। అతులబలా
సాధ్య మెక్కిడునట్టి రాచ। కొదమసింగంబు కై కొను
గుసుమగాత్రి। నెదురుకొనుడని మగల బన్నిదము
జఱచె

విచలత్పౌరుషు లెల్ల రోడు విధముఀ వీక్షించి
నెమ్మోమునఀ। శుచి మందస్మితచంద్రికారుచులు
సంశోభిల్ల గెంగేలి వే। ళ్లచివ్రుళ్లంచుల నెత్తి విల్వి
ఱిచి బాలంగొన్న కోదండరా।ముచరిత్రంబు లనాథ
దీనజనతామోక్షప్రదంబుల్ గదా॥

అని కీర్తించుచు మెల్లగాదిగి విచారాశ్చర్యసందేహ
సం। జనితాలక్ష్యత లొప్ప జూచు జననిఀ సాధ్విఀ
సమీపించి రా। మునికిఀ క్షేమమటంచు బల్కుచు
బదమ్ముల్ సూచి చేగట్టి ని। ల్చెను శాఖామృగ
జాతి వీరహనుమత్సింహంబు మైగూనుతోఀ॥

* వ॥ అంత సంభ్రమాశ్చర్యభయయుక్తయయిన
మైథిలి ధైర్యంబు వహించి మర్కటేశ్వరుం గని
యెవ్వరీవని పృచ్ఛసేయ నతండును,

## —♦ హనుమంతుడు సీతాదేవితో మాట్లాడుట ♦—

హనుమంతుడు :—

అమ్మా! సీతమతల్లి! నీవిభుడు లోకారాధ్యు
డిక్ష్వాకువంశమ్మున పావనముంబొనర్చిన యశ
శ్చంద్రుండు రాముండు ని। తన్నమ్ముల మానస
వర్తి నాకతని పాదాంభోజయుగ్మంపు ధ్యా। నమ్మే
కూడును గుద్దసుమ్మి హనుమన్నాముండమీదాసుడన్

సీత:—

ఇమ్ముగ బల్కుచుంటివి మహీపతిరావణుడంపినట్టి రే।
డ్రిమ్మరు కామవర్తివో పతివ్రతశక్తి నెఱుంగనట్టి భూ
తమ్మువో స్వామిభక్తుడవో — తథ్యమెయా నెడ
స్వాగతమ్ము నే । నమ్మగజాల నెద్ది నరనాథులతో
గపి కెట్లు స్నేహముల్॥

హనుమంతుడు:—

వ్యోమ సంచారభాసి సూర్యునికి గ్రింద । సరసి
బద్మిని కేభంగి సఖ్యమౌనరె। దనుపుటాటల జాతి
భేదంబు లేదు । పుణ్యపూరుషగుణనదీపులినసీమ॥

అని మదిలోని సంశయభయంబుల నూడ్చుచు
రామచంద్ర హ। స్తనలినశాఖికం దనరు శైత్య
గుణావహామా పదాబు వ। న్నెనవకపుంబసిండి
జగనిద్దపుతాజిగిముద్దుటుంగరం। బును వినయంపు
గూను పలుపోకలతోఁగపి యిచ్చె దల్లికిన్॥

ఇచ్చినతోడనేపులకలెత్తి మహోత్పలపత్త్రనేత్రముల్
విచ్చిపసందుముచ్చిపనిబేర్చినబంగరుకొండకందరం।
బచ్చుపడంగ వాదెలచి యద్భుతభావఝరీ
ప్రవాహముం। జెచ్చెర గ్రుమ్మరించుచును జిత్తము
త్రొక్కిసలాడుచుండగన్॥

మల్లెపూమొగ్గపంటి నిర్మల మయూఖ। కందళం
బగు చిఱునవ్వు చింది చింది। గండఫలకమ్ము
నెత్తమ్ము కడచి పాఱె। లేమ తడికంటఁ గనె
నంగుళీయకంబు॥

సమ్మదమార సారఘనసారపటీర తుషారపూర
శై। త్యమ్మున నుండు సౌఖ్యగతి నందుచు జానకి
దేవతా ప్రసా। దమ్ము విధమ్ము దోఁప గనుదమ్ముల
ఉంగర మద్దికొంచు దా। నమ్మిక వుట్టి చూపె
బ్రియనాథకథాశ్రవణాభిలాషమున్॥

## —♦ రాముడు సీతాదేవినుండి విడిపోయిన కథ హనుమంతుడు చెప్పుట ♦—

హనుమంతుడు:—

భవదుత్కంఠ నెఱింగి ప్రేముడి ధనుర్బాణాను
సంధానుడై । జవమొప్పం జని మాయలేడికొఱ
కాసాంద్రాటవీభూములన్ । వివిధాధ్వాంతరవక్ర
ధావనవిధానిష్ణాతు మారీచుడా । నవు నొక్కమ్మడి
గూల్చె రాఘవు డవంధ్యంబైన బాణంబునన్॥

శరవిద్ధుడు మాయాగుణ । పరిణత మారీచు
డైణబంధురభావం । బరుగగ "హా! లక్ష్మణ!"
యనె । హరిదంతము పిక్కటిల్ల నవసానమునన్॥

* వ॥ పూర్వోక్తవిషయంబువిని సీతాదేవి, 100

సీత:—

అదె కాబోలు నెఱుంగ కాయసురమాయల్
"నామనోభర్తా । పద ముట్టెం బద" యంచు
గాఢతమదుర్భాషల్ వకాణించినా । డదిరా!

లక్ష్మణు బంపితిఁ వని కెవశ్యప్రాపణీయంబుగా।
గదలంచెఁ విధి యీగతిం బడితి; నాకర్మంబు
భక్తాగ్రణీ॥

హనుమంతుడు:—

* వ॥ అంత శ్రీరాముండును బర్ణశాలాభ్యంతరంబు సొచ్చి భవద్దర్శనం బపేక్షింప నెందునుంగానమికి నిరవధికచింతాశ్చర్యసంభ్రమంబులం జిక్కి నానా ప్రదేశంబుల గుట్టల దరుల లతానికుంజంబుల నారసి యారసి విసివి వేసారి కలంగంబడి ప్రేమావేశసూచకంబయిన చేతనాచేతనతారతమ్యజ్ఞాన రాహిత్యంబునవివిధపాదపగుల్మలతావితానంబులను శశహరిణాదిజంతుసంతానంబులను నుపలక్షించి కాంతాదర్శనంబు గూర్చి పృచ్ఛ సేయుచు భవద్వియోగరజ్జువుచే నీడ్వంబడుచు సోదరానునయాలాపంబులకు బెడచెవిం బెట్టుచు నుమ్మలించుచు లక్ష్మణునితో దక్షిణదిగభిముఖుండై వచ్చుచు॥

దశరథరాజచంద్రము పక్షిధానసఖుండు ఖగాభిజాత్య సాధ్యశుడు ప్రజానిపీడననిశాటమహాంబుదకష్టకృద్ధరు ద్విశదసమీరవేగుడు వివేకి జటాయువు నిన్నుగూర్చి యా। దశముఖు దాకి చేద్పడిన తాతసమానుడు కానిపింపగఁ॥

* వ॥ వారిద్దరును దెలిపికొని సాష్టాంగపడి లేచి ప్రసంగించుచుండ నతండు॥

" లంకకు జేర్చె జానకిని లక్ష్మణ! రామ! పదుండు పోయె నీ । వంకనె రావణుం" డనుచు వాని భయం కరచంద్రహాసఘూ । తాంకము లెన్నొ చూపుచు గతానువు గాగ భవద్విభుండు ని। శ్శంకత జేసెబో దహనసంస్కృతి బ్రేమరసార్ద్రచిత్తుడై ॥

* వ॥ అంత గొంతదూరమునడచి మార్గంబునందు క్రూరదానవు లనేకుల నతిక్రమించి పోయి॥

విపులంబైన శరీరమందున భుజావిక్షేపసంరంభుడై । యుపరోధించు కబంధరాక్షసుడు బాహుచ్ఛేదితుం డౌచు నే । ల పయిం గూలుచు రామ లక్ష్మణులతో, " లంకాపతిం ద్రుంపగా । కపి సుగ్రీవుని జెల్మి మే" లనె విముక్తద్వేషభావంబునన్ ॥

* వ॥ సుమనోయుక్తుండై సేసిన యాతని పలుకు ననుసరించి వా రిద్దరుం జని చని॥

బుశ్యమూకాద్రిపరిసరోర్వీజవజ్జి । నీడలఁ విశ్ర
మించిన జాడ జూచి । ప్రభుడు సుగ్రీవు డంప
నారాయణాంశ । జనితరాఘవదివ్యదర్శనముగంటి॥

* వ॥ నేను నా విషయంబు దెలుపుడు సేసికొని
వారి వృత్తాంతము బూరసి పరస్పరస్నేహాభిసూచక
సల్లాపంబులం దుండి యనంతరము వారిని సుగ్రీవ
సామీప్యంబునకుం గొనివచ్చి గాఢమైత్రిం గలి
గించితి, అంతట సుగ్రీవుండు మున్ను లంకాభి
ముఖంబుగా బోయిన నీచేత విడువంబడిన నగల
మూటం జూప నీపతి దుఃఖానందంబులం జొక్కె.
పిమ్మట వాలిచే గావింపబడిన రాజ్యనిజదారసంగ్ర
హంబును గూర్చి కపిరాజు స్పష్టంబుగ దెలుప
బాహావిక్రమానలజ్వాలికలం బ్రజ్వలించుచుండిన
యా వాలినిం గూర్చి కుపితుండయి శ్రీరాముడు
తగు సాయం బొనర్తునని పల్కె నాతండును సంత
సించి దానికి బ్రత్యుపకారంబుగా సీతాదేవి విష
యంబున యథాశక్తి సాయం బొనర్తు నని
వాగ్దానం బొనర్చె. కొన్నిదినంబులు గడవంబడుడు
బ్రతిజ్ఞాబద్ధుండయిన రాముండు వాలి వధంబు సేసి
సుగ్రీవుని సంతృప్తుం జేయ నతండును శ్రీరామ

స్నేహం బత్యంతభక్తిగా బరిణమించిన నన్ను జీర
బంచి సీతాన్వేషణంబు గావించి చూచి రమ్మని
యానతిచ్చె. అమితసంతోషంబున నేనును నభి
జ్ఞానార్థంబు భవన్నాథుం డిచ్చిన రత్నాంగుళీయ
కంబును గొని యీపురంబంతయు నన్వేషించి
కొన కీయారామంబు ప్రవేశించి యదృష్టవశంబున
దల్లీ! భవద్దర్శనంబుసేసి కృతార్థుండనైతి; మఱియు
నింతకుమున్ను నీతోడి రావణుని సంభాషణంబును
విని హృదయంబు కలంగి కోపోద్దీపితంబు గాగా
ధైర్యంబున నీ వాడిన మార్దవోక్తులకు శాంతిం
చుచు నిట్లు కడపి రక్కసుండు స్వగృహోన్ముఖుం
డగుట గని నీదరింజేరి నీ విమలపాదకమలంబులకు
బ్రణామంబు గావించి తెలిపికొన సాహసించితి
నమ్మా! నీయవస్థ పాషాణకఠినంబయిన హృద
యంబునుగూడ గరగింప నోపును.

ఆకలమున్ భుజించిన భయావహమౌ గహనాంత
రంబునం । గోకిలశారికామధురకూజితముల్ పలు
చోట్ల ద్రిప్పి యు । త్రాకుల వెట్టినం బడక లౌనని
యా బడినేల జెంగుపై । మేకొని వ్రాలినన్ —
బతి సమీపగతుం డటవిం గృశోదరీ !

* వ॥ అమ్మా! పతిసన్నికర్షం బెడమైన నీ యిప్పటి యవస్థ మిక్కిలి శోచనీయము. మఱియును॥

మునుల పవిత్రగేహముల ముంగిట నింబమహీజ
వాటికల్ । పెనచెడు చల్లనీడ నుపవిష్టులరై నిగ
మాంతసూత్రముల్ । విని పరమాత్మచింతనము
వేడుక గాంచ దలంచు మీరిటుల్ । గనవలసెం
గదా బ్రతుకు గష్టము మాదృశులట్లు దల్లిరో!

భావాతీతవిలాసభాసురపరబ్రహ్మానుసంధాను డా ।
జీవన్ముక్తుడు లోకసంగ్రహకృతాశేషార్థనైష్కర్మ్యశ్
ర । ద్ధావిజ్ఞుం డగు యోగి నీజనకు డిట్ట్వోర్వీశుస్ఫుర
ద్వంశుడౌ । దేవస్తుత్యుడు మామగారు జననీ !
దివ్యస్థితుల్ నీకథల్॥

జీవితావశ్యకాఖిలాస్తిక్యబుద్ధి । బ్రాణి యాత్మో
ద్ధరణ మూన్చు పంటవలతి । నిన్ను గడుపార గనె
నయోనిజవు నీవు । బహుళదుఃఖానుభవమహో
పద్రవములె !

సింహాసనారోహసిద్ధుల మిముజూచి కైకయు నవు
డేల కన్నుగుట్టె । దలుగుపోవగనేల దశరథా
వనిపాల పుత్రస్నుషాప్రేమపూరణంబు । వర
భోక్తృకుల శూర్పణఖ కేల ప్రభవించె శ్రీరామ
మోహైకచిత్తవికృతి । పతిపోవ లేడికై పర్ణశాల
నదేల లక్ష్మణార్యుని కుపాలంభనిహతి । అతుల
దురదృష్టకల్పనాధ్యాయ మేటి । వ్రాయుచుండెను
విధి చరిత్రంబు నీకు । లోకనీతి జనించు మీ పోక
లందె । అమ్మ! సీతామహాదేవి! యడలకమ్మ!

నీపదసంవాహనమునకై పరిచారికలు గాగ ఘటి
యింప నచిం। త్యాపాత్రలు గద వీరా । నీపయి
వెలిగింత్రు కావు నిర్మలచరితా॥

హృదయముఁ జేర్చి రాఘవమహీపతిపాదసరోరుహ
ద్వయిా । సదమలపానశాల ననిశం బిడ జేసెద
విట్లు బంధనా । స్పదబహుకష్ట సంసృతి విచారపథి
శ్రములైనవారికిన్ । సదయువు — రామనామ కల
శంబున జ్ఞానసుధారసంబులన్॥

పాపాపనోదకం బగు । నీ పతినామోచ్చరణము
నిరుపమభక్తిం । జేపట్టితి వెంతయు న । మ్మా !
పోవింపకు మనాథమార్గం బదియే॥

పతివియోగాక్రాంతబాధానుభవలకు రామనామంబె
ధైర్యప్రసాది । దేహోద్ధరవ్యాధిదీర్ఘార్తులకునెల్ల
రామనామంబె దురాయికట్టు । సంసారమృగతృష్ణ
జను పూర్ణబుద్ధికి రామనామము సుమార్గప్రదర్శి ।
ప్రబల కామక్రోధపారతంత్ర్యములకు రామనామంబె
స్వారాజ్యలక్ష్మి । సాధనచతుష్టయ క్షీరసాగర
మున । రామనామంబె దరిజేర్చు రమ్యనౌక ।
రామనామం బనాథుల కామధేను। వమృతభాండో
పలబ్ధి పోనాడకమ్మ !

*. వ॥ అని సీతాదేవిని సంబోధించి సబాష్పోద్గ
మంబుగా సానుక్రోశంబుగా నుగ్గడించి నిరంతర
రామనామోచ్చరణవృష్టి గ్రీడారతుండగు బాల
కునిం బోలి కపికులవరుండు తడియు సుకంబును
బ్రత్యక్షంబుగా ననుభవించుచుండె నంత॥

సీత:—

జాతికి భిన్నుడై ప్రభువిశాలసుఖంబుల గోలుపోయి
క్రూరాతతదుర్గమాటవులయందు జరించు బికారి
రాముపై। గోతులజాతిపెగ్గడకు గూరిమిపుట్టుట
మా యదృష్టమయ్యా! తగునట్లు దీర్పగలమా
భవదీయఋణానుబంధము?

ఆవలియొడ్డునుండి లవణాబ్ధినభఃకుహరాంతరాళ
ఘోరావధి నింతదూరము ననాశ్రయతం గొని
గాలియొంతతో। నీవిధి దిక్కుమాలి పరునింట
వసించిన పేదరాలితో। నేవొ వచింపవచ్చితి
వహీనబలా! కొను నా నమస్కృతుల్॥

* వ॥ అని సీత నమస్కారం బొనర్ప భక్తుం డగు
హనుమంతుం డలజడిపడి॥

హనుమంతుడు:—

అమ్మ! సీతామహాదేవి! యలచినావు। పనులు
చేసెడి పాదసేవకుని కిపుడు। హీనజాతివానికి నమ
స్కృతు లొనర్చి తల్లి! దీవింపు దాసుని తప్పు
గాచి॥

మొద లెటులో మహాపురుషపుంగవదర్శనభాగ్య మబ్బె నాహృదయము తత్స్వరూపము గ్రహించి గ్రహించి జగత్పవిత్రుగా గ దెలియగా సమత్త మున గన్నుల గట్టు శమదమాదికా భ్యుదయ ను పాస్యదేవతగ ముగ్ధతనమ్మితి రాఘవేశ్వరుఁ॥

అమలకరుణానుమేయభాషాంబువులకు । నావ హిల్లెను భక్తిభావాంకురములు । ప్రథమదర్శనవేళా ప్రభావ మద్ది । బిడ్డప్రేమయుండి గద భక్తి పేద తల్లి !

శ్రీరాముండె సమస్తకార్యఘటనా క్షేపక్రియాకర్త యోంకారార్థోత్తముల ముముక్షుల కుపాస్య బ్రహ్మ మాతండె యోంకారాత్ముండు యథాను చింతనము మోక్షంబుం బ్రసాదింప దీక్షారమ్యుం డగు భక్తి కర్మరచనాజ్ఞానోదయా కృష్టుడై ॥

దశరథాగ్రితనూజ తత్పరధ్యానంబె యనిశంబు నాకు శ్వాసానిలంబు । శ్రీరామచంద్రాంఘ్రిసేవా సుధాసార మీయనార్యునికి బానీయతృప్తి । కాకుత్స్థవంశ్యజాగ్రిద్దర్శనాభీష్ట పూర్తియే మృష్టాన్న

భోజనంబు। కౌసల్య కొమరుని కమనీయ కథ
లతో గానమ్మో విహృతిశృంగారవనము। భ్రాతృ
వాత్సల్యమును బితృపరమభక్తి। బరిమళింపించినట్టి
యీ ప్రకృతిశిశువు। సరససల్లాపమే ప్రపంచంబు
నాకు। నాకు బ్రాణం బతండె ధాత్రీకుమారి॥

ఆతనిబట్టి నీకును బదానతుడగు మిమువంటివారలకు
నీతిపథానువర్తనులనిర్మలసేవలదన్ను భాగ్యమ।మ్మా!
తిరిపెంబు గోరుదు సముంచిత రామ కథాసుధా
రస।స్నాతు నొనర్చుచుకు జనకనందిని! నన్ను
బవిత్రు జేయవే॥

ఇంతకు మున్ను శీతశిఖరీంద్రపుజీకటికోననుండి ని।
ష్క్రాంతము గాంగనిర్ఝరము చాడ్పున గోకిలకంఠ
మార్దవా। త్యంతమనోహరత్వమున నమ్మరొ!
"రామ"ము నుచ్చరించి నా।స్వాంతమె కాక యీ
ప్రకృతి సర్వము రామమయం బొనర్పవే॥

కేకిసలాడెడు శారీ। కేకినులకు గాయనులకు గీలిం
చితి రా। మాకర్ణకగీతంబులు। కాకులపాటలకు
లెక్క కడమవి తల్లీ!

సురభిళాశోక మకరందభరము లాన। గర్ణికల నెక్కి
చూడు ఝుంకారమాపి। తోరముగ నిల్చి త్రావెడు
నోరుదెఱచి। రామచారిత్రమధువు సారంగకులము॥

* వ॥ అని యిట్లు వారిద్వరును గొంతవడి రామ
విషయంబు సానందంబుగ సంభాషణము గావించి
కొనినయనంతరంబున హనుమ యామెకు ధైర్యంబు
గఱపుచు,

చతురవీరాంగదజాంబవత్సుగ్రీవ ధైర్యమేరువుతె
యధ్వర్యుజనము। లోకసాంఘికబలప్రాకట్యమున
కైన ధర్మసూత్రము సప్తతంతువహ్ని। మదరాక్ష
సానీక హృదయశల్యం బైన లక్ష్మణుండు ధవిత్రి
లాంఛనంబు। పరిశుద్ధసాన్నాయ్య మరిభయంకర
సైన్య బహుళబాహాబలప్రాభవంబు। ఆమహాత్ముడు
రాముండు యజ్ఞకర్త। పూర్ణముగ నమ్ము నెలదినం
బులలోన। నద్భుతముగ లంకాయాగ మతడు
నేయు। బెంగపడకుము చకితసారంగనేత్రి!

"అంతటి దీర్ఘకాల మేటులా!" యనుకొన్న బదాబ్జ
సేవకుం । డంత యలంతి కాదు — తమ కాత్మ
జనించిన రామదర్శనం । బెంతటిసేపు లోనిది —
అహీనజవప్లవనంబుచే నొకే । గంతు మహాబ్ధిపై—
సమయకార్యవిధిజ్ఞుడ నమ్మ ! మైథిలీ !

సీత:—

వీరాగ్రేసరచక్రవర్తివి మదిన్ వీక్షించియిూనమ్రతా
కారం బంచితసర్వశక్తికలనాగాంభీర్యసంపూర్ణతా
ధారేయుంబని నే గ్రహించితిని సద్యఃప్రాప్తలాభం
బునన్ । శ్రీరామాత్త యశోంబరంబున మషీ
చిహ్నంబు సంభావ్యమే॥

దుర్లంఘ్యలవణపాథోరాశియున్ దాటి రాము
జేరుట యథార్థంబె యనుము । పతిని గన్న
మొఱంగి సతిని దెచ్చిన రాక్షసాధముం డింక
నిందార్హుడగునె। ప్రాణేశబాహుపరాక్రమోద్ధురదీప్తి
జాటింప గల వీరపత్ని నేను । నామాటకేమి
కాంతామానరక్షణధర్మపాలనము కర్తవ్య మిపుడు

రావణుని మార్చు నేత్రపర్వముగ జూచి । విజయ
లక్ష్మిని గైకొను విభుని కెఱిగి । కంట దడివెట్టి
కైనువెంట గాని రాను । మర్కటేశ్వర ! నీమేలు
మఱచిపోను॥

* వ॥ అందులకు మనఃపూర్వకాంగీకరణపురస్సరం
బుగా నా ధర్మదేవత నభినందించి మఱల బయోధి
గడచి రాఘవదర్శనంబు సేసి నీ క్షేమంబు నివే
దింతు నని చెప్పి యాంజనేయుం డా దేవి నామం
త్రణంబు సేయుచు సముద్రమధ్యస్థితలంకాపట్టణ
సీతాసందర్శనంబు గూర్చి దాశరథి యనుమానింప
కుండ నభిజ్ఞానవస్తువు బ్రసాదింపు మని తల్లి నడుగ
నామె మణిప్రభాభాసమానం బయిన తన శిరో
భూషణం బిడ నాతండును మహాప్రసాదం బని
కన్నుల కద్దుకొని యుత్తరీయాంచలంబున ముడి
వైచికొని మఱియొక్క గుఱుతు రాముని యెదుట
దెలుపుటకయి యనుగ్రహింపు మని వేడికొన
వైదేహి కాకాసురవృత్తాంతంబు సవిస్తరమధురం
బుగా బలికె. మఱియును॥

పర్ణశాలావాసబహుసౌఖ్యదినములు మానసానం
దంబు మఱవనను ము। మాయామృగాహరణాయాస
మిచ్చిన పాపాత్మురాలి కీ ఫలమె యనుము । తరిత
ధారావాహికముగాగ గన్నీటి నోడ్చని నిముసంబు
లుండవనుము। శ్రీ రామతారకోచ్చారణానందంబు
లాకలిదప్పుల నార్చెననుము । ఆశిరోనఖమును దదీ
యాకృతి గని। బంధముక్తికి ఘోరతపస్సు జేయు।
నీ యబల నికను ననుగ్రహింపుమనుము । వారి
పాదంబులకు నమస్కార మనుము॥

* వ॥ అని రాముని గూర్చి వచియించి యనంత
రంబున కృతజ్ఞతాభిజ్ఞయు గరుణాతరంగితలోచ
నాంచలయు నయిన జానకీదేవి లక్ష్మణు నుద్దేశించి,

అన్నగారిపయి ప్రేమానుబంధము పేర్మి దండకా
రణ్యబాధలను బడితి । మతదీక్ష జేసితి మాకు మన
స్ఫూర్తి గమనీయభక్తి నిష్కామసేవ । సాన వెట్టితి
భవత్సౌశీల్యరత్నంబు నుగ్రసంకటనికషోపలమున ।
దలవాంచి నాదు పాదద్వంద్వమే కాని ముఖము
నెత్తని ధర్మమూర్తి వీవు । మఱది ! లక్ష్మణ ! యా
లేడిమాయ గనక । రాముని జేరుమని యనరాని

పలుకు । పలికి యుండిన వట్టి నిర్భాగ్యురాల ।
నే మొగంబున జూతువు నా మొగంబు॥

* వ॥ అని సకరుణంబుగా సాస్రుభాషితంబుగా "నామాటల శ్రీరామలక్ష్మణులకు నివేదింపు" మనుడు నంజనాపుత్రుండు వల్లె యని యామె యనుమతిం గొని సాష్టాంగంబుగా నమస్కరించి పోవుచు నాత్మగతంబున.

కనుగొంటిం దుదకైన మానుషజగత్కాంతావతం
సంబు నా । కనులాసించిన నోముపంట నకలంక
ప్రాప్తనిర్వ్యాజదర్శనమాత్రంబున బాపముల్
దొలచు శ్రీరామావనీపాలచం । ద్రుని యర్ధాంగిని
బంట లేబడతి కాన్పిం ధర్మసంకీర్తనన్॥

రఘుకులేశ్వరసేవానురాగఫలమె । జానకీదర్శనోత్థ
భాస్వత్సుఖంబు । కార్యభారంబు నడలె; లంకా
పురంబు । పట్టి చూచెద నింక దోర్బలసమృద్ధి॥

అని బాలోచితఖేలనానుసరణవ్యాలోలుడై యా
త్మలో । ననుమానంబు — భయావలంబనము
గుయ్యాడించి క్రీడించుచుం । డెను లంకాపురకేళికా
వనఫలస్నిగ్ధోరువృక్షంబులన్ । ఘనశాఖాతతిచారు
చంక్రమవిధాకౌటిల్యకౌశల్యుడై॥

జాతిసహజాభిలాష నిశ్చలితు డగుచు । మహిత
ఫలవృతవజ్రికొమ్మలను విఱచి । ఉబుసుపోకకు
రక్షాభటోత్కరముల । నతులబలశాలి యెల్లర
జితుకబోడిచె॥

* వ॥ అనంతరంబున వారందఱు హృదయనిహిత
శల్యాయమానమహితానుశయోద్వేగులై లంకా
పురాధీశ్వరు నెదుటం గలరూపంతయు నుద్ఘాటింప
నాతండును గోతిచేష్టల యలజడికి నబ్బురంబు
గాన్పించుచు గొడుకైన యింద్రజిత్తు నదేమోకను
గొమ్మని నిదేశింప నా వీరుండు హనుమత్సాహ
సంబును జూచి తలపడి గాటంబుగా బోరి పోరి
యోటమి పెట్టుకొనవలసివచ్చుటచే గడకు బ్రహ్మా
స్త్రప్రయోగంబు గావించినయెడ.

బ్రహ్మాస్త్రంబును రాక్షసుం డనుపబ్రహ్మణ్యమూర్
బెట్టకా । బ్రహ్మజ్ఞుండగు రామదూత, నతి, సంభా
వించి తా దాపసా । జిహ్మోదగ్రనిరూఢి ద్రుంప
దగియుం జేరాక రామాక్షరీ । బ్రాహ్మీసంస్మృతి
బాధ నొందక బహిర్బంధాప్తి సూపెం గడుక్॥

* వ॥ అటుపయి నింద్రజిత్తు బద్ధుండైన హనుమ
ద్వీరసింహుని గొనిపోయి తాతయును లంకాధి
పతియు నయిన దశగ్రీవుని సన్నికర్షంబు సేర్చిన

రావణవృష్టుండయి మర్కటశ్రేష్ఠుండు నిజవృత్తాం
తం బంతయు జెప్పి సీతావిషయవాగ్వివాదంబు
సలిపి ధర్మోపదేశంబు గావించిన దనుజుండు రేగి
ముఖంబు తీండ్రింప వధోద్యుక్తుండయ్యె నంతవిభీషణ
వాక్యానుసరణంబున మానుకొని తుదకు లాంగూ
లంబునకు నిప్పు ముట్టింపు డని యానతీయ నను
చరులు వనచరవాలంబునకు యథోక్తప్రకారంబున
నగ్గి వెట్టి విడిచిరి. పదంపడి యా సామీరి
బంధంబులు సడలించుకొని రామనామ
ప్రభావంబునను నీ కల్లోలంబు వినిన సీతాదేవి
యనుగ్రహంబునను దనయందు వైశ్వానరుండు
చల్లబడుటకు సంతసించి వీథులెల్లం గలయం దిరు
గుచు విభీషణప్రాసాదంబు విడిచి తక్కుంగల
రాక్షసగృహంబులన్నిటికి నిప్పంటించిపురంబంతయు
నిర్దగ్ధం బొనర్చుచు నార్చుచు ప్రళయకాలరుద్రుని
వితాన ఘోరక్రీడలం జేసి చేసి కట్టకడకు,

చేత స్త్రీవనిశాచరావసథనాశీభూతతావాంఛ నె।
ట్లో తగ్గించుచు నింటిగాలిపడి వాలుందోకజల్లార్చి
సే। వాతాత్పర్యయుతుం డశోకవని నీవార్తల్ నివే
దించుచు। సీతాదేవియనుజ్ఞ గైకొని చనెన్
శ్రీరామ సేవార్థియై॥ 151

